శ్రీ

# సులభ వ్యాకరణము

**(PART 1)**

*For*

**I, II & III FORMS**

(ఆరు, ఏడు, ఎనిమిది తరగతుల సిలబసు ననుసరించి)

తెల ఉపాధ్యా. భాషాప్రవీ.

శ్రీ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి

విరచితము.



ప్రకాశకులు :

**కల్యాణి గ్రంథమండలి**

విజయవాడ-1

వెల : **0-62**

# విషయసూచిక



సవరణ: (6 వ పేజీలో 1-5 పంక్తి వరకు)

తెనుఁగున లేక సంస్కృతమున నున్న యక్షరములు 19.

ఋ ౠ ఌ ౡ ః ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ థ ధ ఫ భ శ ష.

సంస్కృతమున లేక తెనుఁగున మాత్రమున్నవి 5. ఎ ఒ ఁ ౘ ౙ.

(సంస్కృతాక్షరముల కీయైదుకలిపిన55. 'ఱ' కూడకలిపి '56' అనికొందఱందురు)



గురుమూర్తయేనమః

# వర్ణసమామ్నాయము

తెలుఁగు సంస్కృత ప్రాకృత భాషలనుండి పుట్టినది. కాన సంస్కృతములోనున్న అక్షరములు తెలుఁగులోనికి వచ్చి కనబడు చున్నవి. కొన్ని కేవలము తెనుఁగునమాత్రమే యున్నవి. కొన్ని సంస్కృతమునమాత్రమే యున్నవి. వానిని సవిమర్శముగా తెలిసికొందము.

## సంస్కృతమున వర్ణములు (అక్షరములు) ఏఁబది

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

## ప్రాకృతమున నలువది

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ. (ఋ ౠ, ఌ ౡ, ఐ ఔ, ఙ ఞ శ ష లులేవు.)

## తెనుఁగున ముప్పదియాఱు

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం క గ చ చ జ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ ('ఱ' ఇది 'ర'లో భేదమేకాని వేఱుగా అక్షరము కాదు. 'క్ష' కారము సంయుక్తాక్షరము (క్+ష్+అ=క్ష) కాని వర్ణాంతరము కాదు.)

తెనుఁగున లేక సంస్కృతముననున్న అక్షరములు 16.

ఋౠఌౡఖఘఛఝఠఢథధఫభశష.

సంస్కృతమున లేక తెనుఁగులో మాత్రమున్నవి 6.

ఎఒ ౘ ౙ ఱ (వీటినికూడ కలిపి మొత్తము తెనుఁగున 56 అని చెప్పుదురు.)

ఇందులో 'అ' మొదలు 'ఔ' వరకు నున్న అక్షరములను 'అచ్చులు' అందురు. 'క' మొదలు 'ళ' వరకు నున్న అక్షరములను 'హల్లులు' అందురు. ఁంః (అర్ధానుస్వార, పూర్ణానుస్వార, విసర్గలు) 'ఉభయాక్షరములు'.

అచ్చులకు 'స్వరములు, ప్రాణము'లనియును, హల్లులకు వ్యంజనములు, ప్రాణి' లనియును పేర్లుకలవు.

అచ్చులను విడిగా ఉచ్చరింపగలము కాని హల్లుల నుచ్చరింపలేము. అచ్చులు కలిసి లేనిచో హల్లులు ప్రాణములేని శవములవలె నైపోవును. అందుచే ప్రాణులు (ప్రాణము కలవి) అని హల్లులకు, అచ్చులకు ప్రాణములనియు పేర్లు వచ్చినవి. 'క్+అ=క'. విడిగా అకారము నుచ్చరింపగలము. కాని 'క్'ను ఉచ్చరింపలేము.అట్లు'క్'ను ఉచ్చరింపవలసివచ్చినప్పుడు 'కకార' మని, ఉచ్చారణ సౌకర్యమునకై దానికి 'అ' కారమును చేర్చ వచ్చును. మన మారీతిగానే అక్షరముల వరుసను చెప్పుచుందుము.

హల్లుమీద ఎన్ని హల్లులైనను రావచ్చును,కాని అచ్చుపై నెపుడును అచ్చురారాదు. ఉభయాక్షరము లచ్చులమీదనేవచ్చును.

రెండు-అంతకుమించిన-హల్లులు కలిసిన అక్షరమును 'సంయుక్తాక్షర'మందురు. ఉదా: కృష్ణుఁడు క్+ఋ=కృ: ష్+ణ్+ఉ=ష్ణు: డ్+ఉ=డు. దీనినే వర్ణక్రమమందురు. గుణింతము చెప్పునపుడు 'కకార, అకారములు క' అని చెప్పునది దీనినే. ఇక 'కాకు తల కట్టిచ్చిన క' అన్నది వ్రాతక్రమమేకాని వర్ణక్రమము కాదు. వర్ణక్రమము తెలిసినగాని వ్యాకరణములోని చాల విషయములు తెలియవు కాన చిన్నతనమున ఆ పద్ధతి కలవాటుపడని విద్యార్థులు, తర్వాతనైనను ఆరీతిగా కృషిచేయవలెను. పై ఉదాహరణములో 'కకార ఋకారములు=కృ' అయినది. కాన సంయుక్తాక్షరము కాదు. షకార ణకార ఉకారములు కలిసిన దానిలో రెండు హల్లులున్నవి కనుక అది సంయుక్తాక్షరము. ఇట్లు తెలిసికొనవలెను.

ప్రశ్నలు. 1. తెనుఁగులో అక్షరము లెన్ని ?

2. ఏ యేభాషలనుండి తెనుఁగులోనికి అక్షరములు వచ్చినవి ?

3. అవేవి? ఆ యక్షరములున్న పదములను కొన్నింటి నుదాహరింపుము ?

4. సంయుక్తాక్షరమన నేది ?

5. కొన్ని పదములకు వర్ణక్రమము వ్రాసి, చెప్పుము ?

# 2. నామవాచకములు

ఒక వ్యక్తినిగాని, ప్రదేశమునుగాని, వస్తువునుగాని తెల్పునది నామవాచక మనబడును. ఉదా: రాముడు, అయోధ్య, పుస్తకము మొదలగునవి.

వాచకములు మూడు.

ఈ నామవాచకములకు లింగ వచన విభక్తు లుండును. 'పుంలింగము, స్త్రీలింగము, నపుంసకలింగము' అని లింగములు మూడు. ఈలింగములు సంస్కృతములోనేకాని తెలుగులో లేవు. తెలుగులోలింగములకు బదులుగా వాచకములున్నవి. అవిమూడు. 1. మహద్వాచకము. 2.మహతీ వాచకము. 3.అమహద్వాచకము.

మహద్వాచక మనగా దేవతలలోగాని,మనుష్యులలోగాని. యిట్లు మాట్లాడగల జాతిలో మగవారిని తెల్పు పదములు. ఉదా: రాముడు, ఇంద్రుడు, బ్రహ్మ, రావణుడు, వాసుకి, చిత్ర రథుడు, కుబేరుడు, మున్నగునవి.

వీరిలోనే స్త్రీలను తెల్పునవి మహతీవాచకములు. ఉదా: సీత, శచీదేవి, సరస్వతి, మండోదరి, ఉలూచి, రంభ, మొదలైనవి.

తిర్యక్కులను, జడములను తెల్పునవి అమహద్వాచక ములు. తిర్యక్కులనగా పశువులు పక్షులు మున్నగునవి. ఉదా: ఆవు, ఎద్దు, నెమలి, కోడి, చిలుక, పాము, తేలు, చీమ, దోమ మొదలైనవి. జడములనగా చెట్లు, కొండలు, నదులు మున్నగు నవి. ఉదా : మామిడి, రావి, హిమాలయము, వింధ్య, గంగ, నర్మద, గోదావరి, పుట్ట, బిల్ల మొదలైనవి.

ఈ పశుపక్ష్యాదులలో మగవానిని చెప్పునవైనను, ఆడు వానిని చెప్పునవైనను అమహద్వాచకములే యగును. అంతేకాని సంస్కృతములోవలె పురుషులను చెప్పునవి పుంలింగములు. స్త్రీలను చెప్పునవి స్త్రీలింగములు, రెండును కానివినపుంసకములును కావు. సంస్కృతములోకూడ సామాన్యముగా మనము చెప్పు రాన్నదేకాని కొంత విశేష మున్నది. అది ముందు తెలియ నగును.

వ చ న ము లు.

తెనుగున వచనములు రెండు. 1. ఏకవచనము. 2. బహువచనము. ఒక్కవస్తువును చెప్పునది ఏకవచనము. ఉదా: రాముడు, చెట్టు మొ॥ ఒకటికి మించి యెన్నిటినైన చెప్పునది బహువచనము. ఉదా: రాములు, చెట్లు మొ॥

వి భ క్తు లు:

విభక్తులు ఎనిమిది. ఒక్కొక్క విభక్తిని తెల్పుటకు ప్రత్యయములున్నవి. అవి ప్రతిపదమునకు చివరచేరును. వాటిని బట్టి విభక్తిని తెలిసికొనవలయును.

| విభక్తిప్రత్యయములు. | విభక్తులు. |
|---|---|
| 1. డు, ము, వు, లు. | ప్రథమావిభక్తి |
| 2. నిన్, నున్, లన్, కూర్చి (గురించి) | ద్వితీయావిభక్తి |
| 3. చేన్, చేతన్, తోడన్, తోన్, | తృతీయావిభక్తి |
| 4. కొఱకున్, కై. | చతుర్థీవిభక్తి |

5. వలనన్, కంటెన్, పట్టి. పంచమీవిభక్తి
6. కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్. షష్ఠీవిభక్తి
7. అందున్, (ఇందున్,) నన్. సప్తమీవిభక్తి
8. ఓ, ఓరి, ఓయి, ఓసి. సంబోధనప్రథమావిభక్తి

ఈ ప్రత్యయములు పదముల చివర చేరును. సం. ప్ర. విభక్తి ప్రత్యయములు మాత్రము పదముల ముందరనే చేరును. ఏవిభక్తి ప్రత్యయము లేనిది ప్రథమావిభక్తియని తెలియవలెను.

ఉదా: రాము(డు+లు=రాములు, వనము+లు=వనములు. ఓకృష్ణా, ఓబాలకులారా! మొ॥రాజు. అన్న, తండ్రి, తల్లి మున్నగు వానిలో ఏవిభక్తి ప్రత్యయము లేనందున ప్రథమావిభక్తియే యుండును. ఈప్రత్యయములతో ఉపయోగ మెక్కువగానుండును కాన జ్ఞాపకముంచుకొన వలెను.

ప్రశ్నలు:1. వాచకము లెన్ని? అవేవి? అమహద్వాచక మననేది?

2. లింగములకు-వాచకములకు కలభేదమును తెల్పుము?

3. నీపాఠములోని పదములను మూడు వాచకములకు నుదాహరింపుము?

4. విభక్తిప్రత్యయము లేవి? ప్రత్యయము చేరుటలోని భేదమేది?

5. ఏవిభక్తిప్రత్యయము లేనిదేవిభక్తియగును? ఉదాహరింపుము?

6. ప్రత్యయములలో 'న్' చివరనున్న వాటిని విడదీయుము?



## 3. విశేషణములు

ఒక వస్తువుయొక్క విశేషమును (గుణము, రూపము, శీలము మొదలైనవి.) తెల్పునది విశేషణము. ఉదా: తెల్లని గొడుగు, మంచిబాలుఁడు, పొడుగుకఱ్ఱ, పొట్టిగుఱ్ఱము. వీనిలో తెల్ల, మంచి, పొడుగు, పొట్టి అను పదములు గొడుగు మున్నగు వస్తువుల విశేషమును తెల్పుచున్నవి. కాన ఇవి విశేషణములు. గొడుగు మొదలైనవి విశేష్యములు.

విశేషణములు, విశేష్యములు కూడ నామవాచకములే. ఈరెంటికిని లింగవచన విభక్తు లుండును. అవి నామవాచకము లకు చెప్పినట్లు చూచుకొన వలెను.

ప్రశ్నలు: 1. నీ పాఠమునుండి విశేషణములను, విశేష్యము లను ఏఱి చూపుము?



## 4. క్రియాపద పరిచయము

పనులను తెల్పువాటిని క్రియలందురు. రాముఁడు వెళ్లెను; రాముఁడు పనిచేసెను; పండును తినెను. వీనిలో వెళ్లెను, చేసెను, తినెను అనునవి, వెళ్లుట, చేయుట, తినుట అను పనులను తెల్పు చున్నవి. కాన ఇవి క్రియలు.

రాముఁడు వెళ్లెను: ఇది ఏకాలమును తెల్పుచున్నది? జరి గిన కాలమును; కాన ఇది భూతకాలములో వాడబడినది.

రాముఁడిప్పుడు వెళ్లుచున్నాఁడు: ఇది ఏ కాలమును చెప్పుచున్నది? జరుగుచున్న కాలమును. కనుక ఇది వర్తమానకాలములో నున్నది.

రాముఁడు రేపు వెళ్లఁగలఁడు: ఇది ఏకాలమును సూచించుచున్నది? జరుగఁబోవు కాలమును. కావున ఇది భవిష్యత్కాలములో ప్రయోగించఁబడినది.

పై మూఁడు కాలములు కాక తెనుఁగున 'తద్ధర్మకాల' మని నాల్గవకాలమున్నది. దానినెప్పుడును జరుగునట్టిపనిని సూచించవలసి వచ్చినప్పుడు వాడుదుము. ఉదా: సూర్యుఁ డుదయించును. పక్షు లెగురును. ఆవు పాలనిచ్చును. ఇందు ఉదయించును మున్నగు క్రియలు తద్ధర్మకాలమును సూచించు చున్నవి. ఏలయన: ఉదయించుట, ఎగురుట, ఇచ్చుట మొదలైన పనులు మూఁడు కాలముల యందును జరుగునవియే. ఇట్లు మొత్తము తెనుఁగున నాల్గు కాలములున్నవి.

వ చ న ము లు:

వాఁడు చదివెను—వారు చదివిరి. వీటిలో భేదమేమి? మొదటిది ఒక్కని పనిని తెల్పుచున్నది. కాన అది ఏకవచనమున నున్నది. రెండవది చాలమంది పనిని తెల్పుచున్నందున అది బహువచనమున నున్నది. అనగా సాధారణముగా కర్తను బట్టి క్రియలయొక్క వచనము మారును.

మరొకమార్పును గమనించుము.

నీవు చదివితివి.—మీరు చదివితిరి.

నేను చదివితిని— మేముచదివితిమి.

వాఁడు చదివెను-వారు చదివిరి.

పురుషలు.

వీటిలో భేదమేమి? కర్తలను బట్టి క్రియాపదముల రూపమే మారినది. ఆమార్పు అన్ని కాలములకు నుండును. వాటిని 'పురుష' లందురు. నేను-మేము కర్తగా నున్నప్పుడు వాడబడు క్రియలు ఉత్తమపురుషలు. నీవు-మీరు కర్తగా నున్న ప్పుడు వాడబడునవి మధ్యమపురుషలు మిగిలినవేవి కర్తగా నున్నను (వాఁడు, ఎవఁడు, రాముఁడు, బాలురు మొ॥) వాడబడునవి ప్రథమపురుషలు. అనగా పురుషలు మూఁడు. ప్రథమపురుష, మధ్యమపురుష, ఉత్తమపురుష, వీటికి కర్తలను తెల్పుటకు తేలికయైన సూత్రము లున్నవి. 'ఎక్కడెక్కడో ప్రథమ, ఎదుట మధ్యమ, తన్ను ఉత్తమ' అని. ఎక్కడో వానిని చెప్పవలసి నప్పుడు ప్రథమపురుషను, ఎదుటగానున్న వారిని చెప్పునపుడు మధ్యమపురుషను, తన్నుగూర్చి చెప్పునపుడు ఉత్తమపురుషను వాడవలెను.

చేయు = చేయుట (To do)

భూతకాలము

| ఏక. | బహు. |
|---|---|
| చేసెను | చేసిరి |
| చేసితివి | చేసితిరి |
| చేసితిని | చేసితిమి |

వర్తమానకాలము

| ఏక | బహు |
|---|---|
| చేయుచున్నాఁడు | చేయుచున్నారు |
| చేయుచున్నావు | చేయుచున్నారు |
| చేయుచున్నాను | చేయుచున్నాము |

భవిష్యత్కాలము

| | |
|---|---|
| చేయఁగలఁడు | చేయఁగలరు |
| చేయఁగలవు | చేయఁగలరు |
| చేయఁగలను | చేయఁగలము |

తద్ధర్మకాలము

| | |
|---|---|
| చేయును | చేయుదురు / చేసెదరు |
| చేయుదువు / చేసెదవు | చేయుదురు / చేసెదరు |
| చేయుదును / చేసెదను | చేయుదుము / చేసెదము |

తద్ధర్మకాలమును మన మొక్కొక్కప్పుడు భవిష్యత్కాలములోకూడ వాడుదుము. వాడు రేపు చేయును, అది తప్పుకాదు. కాని 'వాడు రేపుచేయబోవును.' అనుటతప్పు. భవిష్యత్కాలమున ముఖ్యక్రియకు 'కల' కలిపి వాడవలెను. ఈమాట గమనించుము. 'నేను వీసెడు పంచదార మోయగలను. బస్తాధాన్యమును మోయలేను' ఈవాక్యములలోని 'మోయగలను' అను క్రియ శక్తిని

తెల్పుచున్నది. కాని భవిష్యత్కాలమునుకాదు. ఆభేదమును సందర్భమును బట్టి తెలిసికొన వలెను.

ప్రశ్నలు : 1. కాలములెన్ని? అవేవి?

2. ఏ యే అర్థములలో ఏ యే కాలములు వాడఁబడును?

3. పురుషలెన్ని? అవేవి? అవెప్పుడు వాడఁబడును?

4. వచనము లెన్ని? అవేవి? వాని వాడుకను తెల్పుము?

5. 'కల' పదప్రయోగమును గూర్చి వివరించుము?

6. నీ పాఠ్యగ్రంథములోని కొన్ని క్రియలను నాల్గుకాలములలోను వ్రాయుము?



# సులభ వ్యాకరణము

## Second Form

## (ఏడవతరగతి)

### 1. వర్ణములు-సంజ్ఞలు.

అచ్చులు, హల్లులు అని వర్ణములు రెండు రకములని నేర్చినారు. ఇప్పుడు వానిలోని అవాంతర భేదములను తెలిసికొనుడు.

| | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| కవర్గు | క | ఖ | గ | ఘ | ఙ |
| చవర్గు | చ చ | ఛ | జ జ | ఝ | ఞ |
| టవర్గు | ట | ఠ | డ | ఢ | ణ |
| తవర్గు | త | థ | ద | ధ | న |
| పవర్గు | ప | ఫ | బ | భ | మ |

1. పరుషములు

3. సరళములు

2, 4. వర్గయుక్కులు (వర్గములలో సరి అంకె కలవి)

5. అనునాసికములు (ముక్కులోకూడ పలుకబడునవి)

'అ, ఇ, ఉ, ఋ, ఌ, ఎ, ఒ.' హ్రస్వములు (పొట్టిగా పలుకబడునవి.)

'ఆ, ఈ, ఊ, ఋూ, ౡ, ఏ, ఐ, ఓ' లు దీర్ఘములు. (పొడవుగా నుచ్చరింపబడునవి) 'ఏ, ఒ ఓ'లు వక్రములు. 'ఐ, ఔ'లు వక్రతమములు.

'య, ర, ల, వ'లు అంతస్థములు.

'శ, ష, స, హ'లు ఊష్మములు.

'న' కారమునకు ద్రుతము అనియు పేరున్నది. నకారము తప్ప మిగిలిన హల్లులకు 'స్థిరము'లనియు పేరున్నది.

అనుస్వారము

సున్న (ం) నే అనుస్వారమందురు. అది రెండు రకములు. అర్ధానుస్వారము (అరసున్న.ఁ) పూర్ణానుస్వారము (నిండు సున్న. ం) అని. ఈ అరసున్న ఇంచుమించుగా తెలుఁగులోనే కలదనవలెను. సాధారణముగా ప్రథమావిభక్తి ప్రత్యయమైన 'డు' నకు ముందు అరసున్న యుండును. ఉదా: రాముఁడు, కృష్ణుఁడు, అల్లుఁడు మొ॥ కొన్ని పదములలో మధ్యనుండును. ఉదా: అరఁటి, తోఁట, మీఁద మొ॥

ఋూ, ౡ, ౡ, ఙ, ఞ ణ' లతో ఆరంభింపబడు పదములు తెలుఁగులో లేవు. ఋూకారముతో కూడిన పదములు కొన్నియును, ఌ కారముతో కూడిన పదములొకటి రెండును కలవు. కాని 'ౡ' కారముకల పదములేదు. 'ఙ,ఞ' సంయుక్తాక్షరములుగా వాడఁబడును. విసర్గలు మధ్యలో నున్న సంస్కృత పదములున్నవి కాని 'సున్న, విసర్గలు' చివరనున్న పదములు తెనుఁగు

లో లేవు. తెనుఁగుపదముల కన్నింటికిని చివర అచ్చుతే యుండును.

ప్రశ్నలు : 1. అచ్చులకున్న సంజ్ఞలను తెల్పుము ?
2. హల్లు లెన్నివిధములు ?
3. 'స' కారమున కేయే సంజ్ఞ లున్నవి ?
4. సున్న లెన్నిరకములు ?
5. పదముల మొదట, చివరలేని అక్షరము లేవి ?

## 2. భాషాభాగములు

తెలుఁగుభాష సంస్కృతభాషనుండి పుట్టినది. కనుక చాల భాగము నియమములు సంస్కృతభాష ననుసరించియే యుండును. మన పాఠ్యప్రణాళిక (Curriculum) ఇంగ్లీషు భాషానుసారముగా వ్రాయబడుటచేతెలుఁగు వ్యాకరణమును దానికి తగినట్లుగా వ్రాయుచున్నారు. కాని ఆరీతిగా వ్రాయుట సమంజసము కాదు. ఏ భాషాపద్ధతులు దానివేకాని మారనేరవు. వాటిని మార్చగల శక్తి మనవద్ద లేదని నా నమ్మిక. అందుచే పెద్దపెద్ద పుస్తకములలోనుండు రీతినే తేలికగా ఇక్కడ వీలైనంతవరకు తెల్పుదును. ఆంగ్లభాషాపద్ధతినికూడ తెల్పుదును కాని అది ప్రధానముకాదు: నిర్దిష్టమును కాదు.

భాష రెండుభాగములు. సుబంతము (శబ్దము), తిజంతము లేక క్రియ (ధాతువు). విభక్తి ప్రత్యయములు కలవి సుబంతము, పనిని తెల్పునవి క్రియలు.

ఈ సుబంతములలో నామవాచకములు, సర్వనామములు, విశేషణములు, అవ్యయములు. అని నాల్గురకములున్నవి. నామ వాచకములలో విశేషణములు, విశేష్యములు నుండును. సర్వ నామములన్నియు విశేషణములే. అందుచేతనే అవి నామవాచక మునకు బదులుగా వాడబడును. నామవాచక-సర్వనామములకు వాచక, వచన, విభక్తు లుండును. అవి లేనివి అవ్యయములు. ఉదా: ఎప్పుడు, ఎంత. ఊరక, వచ్చి, వెళ్ళి. వెళ్ళుచు మొదలైనవి. ఈ రీతిగా నేర్పుటచే తెలుగు వ్యాకరణాను సారము భాషాభాగములేవో చక్కగా తెలిసికొనగల్గుదురు. ఇది అలవాటైనపద్ధతికి విపరీతమైననుశాస్త్రీయమగుటచే నేర్పఁదగినది.

# 3. నామవాచకములు

వ్యక్తి నామవాచకములు, సముదాయ నామవాచకములు, జాతి నామవాచకములు, గుణనామవాచకములు అని నామవాచక ములు నాల్గురకములు.

1. ఒకే వ్యక్తిని, నగరమును, వస్తువును తెల్పునవి వ్యక్తి నామవాచకములు. ఉదా: రాముఁడు.గంగ, రాజమహేంద్ర వరము, వింధ్య మొ॥ (Proper Nouns)

2. ఒక గుంపు లేక మందను తెల్పునవి సముదాయ నామవాచకములు (Collective Nouns) ఉదా: జనము, మంద, గుంపు, ప్రోగు మొ॥ 3. ఒక జాతిని చెప్పునవి జాతినామ వాచ కములు. (Common Nonus) ఉదా: మనుష్యుఁడు. ఆవు, నెమలి, నది, కొండ, చెట్టు మున్నగునవి.

4. గుణ నామవాచకములు (Abstract Nouns) గుణములను తెల్పునవి. ఉదా: నలుపు, తీపి, మంచి, పొడుగు, ఎత్తు, పుణ్యము మొ॥

ఈ నామవాచకములన్నియు విశేషణములు, విశేష్యములు కూడనగును. కాన నీభాషలో విశేషణములను వేరుగా విభజింప వీలుపడదు. ఉదా: పెద్దమంద: మందయావులు. మంచి మనుష్యుడు. మనుష్యుఁడగు రాముఁడు. చాలపొడుగు: పొడుగైన చెట్టు.

వ్యక్తినామవాచకములుకూడ విశేషణములుగా వాడఁబడును. వానివివరము ముమ్ముందు తెలిసికొననగును.

ప్రశ్నలు: 1. నామవాచకము లెన్నిరకములు?
2. విశేషణ, విశేష్యము లనగానేవి?
3. నీ పాఠమునుండి ఉదాహరింపుము ?

## 4. సర్వనామములు

సర్వముఁ (అన్నిఁటిని) చెప్పునవి సర్వనామములు. నేను. వాడు, ఎవడు మున్నగు పదము లందరిని చెప్పును. అందుచే వీటిని సర్వనామము లందురు.

ఇవి వ్యక్తివాచక, సంఖ్యావాచక, పరిమాణవాచక, స్థలవాచక, ప్రశ్నార్థక, నిశ్చయార్థకములని ఆఱు రకములు. వ్యక్తులను తెల్పునవి వ్యక్తివాచకములు. నేను, నీవు, వాఁడు, వీఁడు, ఎవఁడు మున్నగునవి. సంఖ్యలను తెల్పునవి సంఖ్యావాచకములు. ఒకటి, రెండు, వెయ్యి, కోటి మొ॥ పరిమాణమును తెల్పునవి పరిమాణవాచకములు. అన్ని, ఇన్ని, ఎన్ని మొ॥ స్థలమును

తెల్పునవి స్థలవాచకములు. అక్కడ, ఇక్కడ, ఎక్కడ, ము॥ ప్రశ్నించుట కుపయోగింపబడునవి ప్రశ్నార్థకములు, ఎవఁడు, ఎక్కడ, ఎప్పుడు, ఎన్ని ము॥

నామవాచక, సర్వనామముల కీవిభాగము వ్యాకరణ గ్రంథములలో చెప్పబడినది కాదు. ఆంగ్లపద్ధతి ననుసరించి వ్రాయబడినది.

ప్రశ్నలు : 1. నీ పాఠమునుండి సర్వనామములలోని రకముల నెత్తి వ్రాయుము?

2. కొన్నింటిని స్వంతవాక్యములలో ప్రయోగింపుము?



## 5 శబ్దములు

సుబంతముల కన్నింటికి వాచక (లింగ) వచన, విభక్తు లుండునని చదివితిరికదా ! అవి చేరునపుడు వచ్చు రూపములను స్థూలముగా తెలిసికొనుడు.

ప్రథమావిభక్తిలో ఏకవచనమున 'డు, ము, వు' చేరును. ఉదా: రాముఁడు, వనము, గురువు, మొ॥ బహువచనమున 'లు' చేరును. ఉదా: రాములు, వనములు, గురువులు మొ॥ 'డు' చేరినవాటికి బహువచనమున 'డు' పోయి 'లు' చేరును. 'ము, వు' చేరినవాటికి అవి ఉండగానే 'లు' చేరును.

ద్వితీయా విభక్తిలో 'డు' చేరినవాటికి 'ని' చేరును. రాముని, కృష్ణుని, అల్లుని. 'ము, వు' చేరినవాటికి 'ను' చేరును. ఉదా: వనమును, గురువును. బహువచనమున 'ల' చేరి 'ను' చేరును. ఉదా: రాములను, వనములను, గురువులను,

తృతీయ మొదలైన విభక్తులునింతే.

| | | |
|---|---|---|
| ఉదా: | రామునిచే | రాములచే |
| | రామునికొఱకు | రాములకొఱకు |
| | రామునివలన | రాములవలన |
| | రామునియొక్క | రాములయొక్క |
| | రామునియందు | రాములయందు |

'ము, వు' లున్నవాని రూపములు: గురువుచే, గురువుచే, ధనముకొఱకు, ధనములవలన మొదలైన రీతిగా ఊహించుకొనవలెను.

'డు' చేరని పదముల రూపములు.

| | |
|---|---|
| అన్న-అన్నలు | వాగు-వాగులు |
| బల్లి-బల్లులు | ప్రోగు-ప్రోగులు |
| గోడ-గోడలు | పేట-పేటలు |

'ఇ' కారము చివర కలవానికి బహువచనమున మార్పువచ్చును.

| | |
|---|---|
| హరి-హరులు | తల్లి-తల్లులు |
| గిరి-గిరులు | తండ్రి-తండ్రులు |

బహువచనమున మార్పు వచ్చునవి.

ఆవు—{ఆవులు / ఆలు}  చేను—చేలు
రాయి—రాలు
పేను—పేలు  రేయి—రేలు

ఏకవచనమున 'లు' చివరనున్నవి, మఱికొన్ని-

చెల్లెలు-చెల్లెండ్రు  కోడలు-కోడండ్రు
నీరు—నీళ్లు  గొడ్డలి-గొడ్డళ్లు
త్రాడు-త్రాళ్లు  పందిరి-పందిళ్లు

సర్వనామములలో విభక్తి రూపములు

మహద్వాచకములు  మహతీవాచకములు

వాఁడు-వారు, వారలు, వాండ్రు  ఆమె-వారు
ఎవఁడు-ఎవరు  ఎవతె-ఎవరు
వీఁడు—వీరు, వీరలు  ఈమె-వీరు

అమహద్వాచకములు

అది-అవి  ఒకఁడు, ఒకతె, ఒకటి
ఏది-ఏవి  ఇద్దరు, ఇద్దరు, రెండు
ఇది-ఇవి  ముగ్గురు— ముగ్గురు, మూఁడు

ఎనమండ్రు, తొమ్మండ్రు, పదిమంది, వందమంది, కోటి మంది. ఇత్యాది.

# 6. నిత్యైకవచన-నిత్యబహువచనములు

కొన్ని శబ్దములకు ఏకవచనము మాత్రమే యుండును. అట్లే కొన్నింటికి బహువచనము మాత్రమే ఉండును. ఇట్టి పదములను ఏకవచన, బహువచనములలో నేది వాడవలసి యున్నను ఒక్కరూపమునే వాడవచ్చును.

1. విభజింపరాని పదార్థమును చెప్పునవి-నూనె, నేయి, నెయ్య, పాలు, బియ్యము మొ॥

2. సస్యవాచకములును — వరి, కంది, పెసర, జొన్న మొదలగు నవియు నిత్యైక వచనములు. (ఇవి సస్యమును మాత్రమే చెప్పును) అనగా ఎప్పుడును ఏకవచనములుగనే యుండును. నూనెలు, నేతులు అని చెప్పినను, నూనె, నేయి అన్నను అర్థమొక్కటే. ఇట్టి వాటిని విభజింపవలసి వచ్చినపుడు వీశెడు, సోలెడు, బిందెడు, గిన్నెడు అను రీతిగా చెప్పవలెను.

1. అందలు, ఇందలు, మొదలైనవియు, 2. కందులు. పెసలు, మినుములు మున్నగు, ధాన్యవాచకములును, ఇరులు (చీకటి) మున్నగు పదములును నిత్యబహువచనములు. ధాన్యవాచక పదములకు ఏకవచనము చెప్పవలసి వచ్చినపుడు 'ఒక్క కంది గింజ, రెండు పెసర గింజలు, బస్తా పెసలు,' మొదలైన రీతిగా చెప్పవలెను. ఇట్టివి క్రమేపి తెలియనగును.

ప్రశ్నలు : 1. శబ్దముల కేకవచన బహువచనములలోని భేదమును వ్రాయుము?

2. సర్వనామములలో వాచక భేదములను గుర్తించి వ్రాయుము?
3. నిత్యైక వచనములను పాఠమునుండి యెత్తి వ్రాయుము?
4. నిత్యబహువచనము రూపమును పాఠము నుండి ఉదాహరింపుము?
5. కొన్ని శబ్దములకు అన్ని విభక్తులలోను రూపములను వ్రాయుము?
6. కొన్ని శబ్దములను అన్ని విభక్తులలో ప్రయోగించి చూపుము?

## 7. వాచక భేదములు

మహద్వాచకమును మహతీ వాచకముగా మార్చినపుడు కొన్ని భేదములు కల్గును. వాటిని 'స్త్రీ ప్రత్యయములు' అందురు.

| | |
|---|---|
| బుద్ధిమంతుడు | బుద్ధిమంతురాలు, బుద్ధిమతి |
| ప్రతిభాశాలి | ప్రతిభాశాలిని |
| కలహకారి | కలహకారిణి |
| అధికారి | అధికారిణి |
| బాలుఁడు | బాల |
| పుత్రుఁడు | పుత్ర, పుత్రిక |
| దాసుఁడు | దాసి |

వంటవాఁడు వంటకత్తె. వంటకత్తియ
ఆటగాఁడు ఆటకత్తె, ఆటకత్తియ

ఇవిపదమునకుసరిగా స్త్రీ ప్రత్యయము చేర్చినవి. పురుషున కొకటి స్త్రీకి వేరొకటిగా పదములున్నవి:- 'కొడుకు-కోడలు' మున్నగునవి భాషలో చూచుకొన వలసినవే. కొన్ని పశు పక్ష్యాదులకు చెప్పునప్పుడు—దున్నపోతు-గేదె, మేకపోతు—మేక, కోడిపుంజు-కోడిపెట్ట, మగతాడి-ఆడతాడి మున్నగు రీతిగా వేరుగా నుండుటగాని, పోతు, పెంటి మున్నగు భేదక పదములను ప్రయోగించుకొని కాని చెప్పుదురు.

## 8. క్రియలు

(సమాపకములు-అసమాపకములు)

రాముఁడు బడికి వెళ్లెను. రాముఁడు బడికివెళ్లి పుస్తకము కొనెను. వీనిలోని భేదమును గమనింపుము. మొదటి దానిలోని 'వెళ్లెను' అన్నక్రియతో వాక్యము పూర్తియగు చున్నది. అందుచే అది సమాపకక్రియ. రెండవదానిలో 'వెళ్లి' అన్న క్రియతో వాక్యము పూర్తియగుట లేదు. కాన అది అసమాపకక్రియ ఇట్టి అసమాపకక్రియలు ప్రతిధాతువు మీదినుండి పుట్టును.

'వెళ్లు' ధాతువునుండి-

వెళ్లి, వెళ్లక, వెళ్లుచు, వెళ్లన్ (వెళ్లగా అను నర్థములో) వెళ్లినన్, వెళ్లుడున్. ఇత్యాది.

తెనుగున ధాతువులు 'ఉ' కారాంతములుగానే యుండును. వాటినుండి అసమాపక రూపములు పుట్టును. వాటిని మాటల వాడుకను బట్టి తెలిసికొన వలెను.

ధాతువులు: వ్రాయు, చేయు, వెళ్లు, తిను, కను, పొందు, రంజించు, అలుగు, చదువు, నడుచు. పరుగెత్తు, త్రాగు, సృష్టించు ఇత్యాది.

క్రియావిశేషణములు: క్రియల యొక్క విశేషమును తెల్పునవి క్రియా విశేషణములు. (Adverbs) గట్టిగామాట్లాడెను. మెల్లగా నడిచెను. మున్నగునవి. ఇవన్నియు శబ్దములకు 'కాన్' అనునది చేర్చిన తయారగును, కావున వీనిని వేరుగా భాషాభాగములుగా లెక్కింప నక్కరలేదు. 'కాన్' అనునది 'అగు' ధాతువుయొక్క అసమాపక క్రియారూపమే.

ప్రశ్నలు : 1. ధాతువుల మూలరూపములను పదింటిని వ్రాయుము?

2. సమాపక,అసమాపక రూపములనుకొన్నింటిని వ్రాయుము?

3. సమాపకమునకు, అసమాపకమునకు కల భేదమును సోదాహరణముగా వ్రాయుము?

4. కొన్ని క్రియలను స్వంత వాక్యములలో వాడుము?

5. క్రియావిశేషణ మన నేమి?

6. కొన్ని క్రియా విశేషణముల నుదాహరింపుము?



# ౯. కర్త కర్మ క్రియలు

మన మనస్సులోని ఊహను పైకి చెప్పుటకును, ఇతరుల కర్థమగుటకును భాష నుపయోగింతుము. కొన్ని అక్షరము లొక పదము-లేక మాటకాగా, కొన్ని పదములు కలిసి వాక్యమగు చున్నది. భావము పూర్తిగా బోధించుటకు చాల వాక్యములు కావలెను. ప్రతి వాక్యము పూర్తి యగుటకు ఆవాక్యము చివర సమాపకక్రియ యుండవలెను. అట్లున్న వాక్యములో సాధారణ ముగా కర్త, కర్మ, క్రియ అని మూడు భాగము లుండును. మిగి లిన వెన్ని యున్నను ఈమూటికి సంబంధించినవేయై యుండును.

క్రియను 'ఎవరు? ఎవశె? ఏది? అని ప్రశ్నింపగా (ఆకాంక్ష చేయగా) జవాబుగా వచ్చునది (బుద్ధికు పట్టువరకు నిట్లే నేర్చు కొనవలెను.) కర్త: దేనిని? వేనిని? అను ప్రశ్నకు జవాబుగా వచ్చునది. కర్మ. కర్తను 'ఏమి చేసెను'? అని ప్రశ్నింపగా జవాబుగా వచ్చునది క్రియ యగును.

ఉదా: రాముడు విభీషణుని కాపాడెను. ఇందు కాపాడుట క్రియ. ఎవరు కాపాడిరి? రాముడు, కాన రాముడు కర్త. ఎవ రిని? విభీషణుని. కాన విభీషణుని కర్మ. రాముడేమి చేసెను? కాపాడెను. కాన అది క్రియ.

విశేషము: మనము విభక్తి ప్రత్యయములను నేర్చితిమి కదా. అవి నెమరు వేసికొనవలెను. కర్మ ఎప్పుడును ద్వితీయ -లేక ప్రథమావిభక్తిలో నుండి తీరును. ఇది బాగుగా గుర్తుంచు కొనవలసిన విషయము.

'రాముఁడు బడికి వెళ్లెను' ఇందు 'బడికి' కర్మయని చాల మంది భ్రాంతిపడుదురు, కాని అది కర్మకాదు. ఎందుచేత? 'బడికి' లో చివర 'కి' ఉన్నది కాన అది షష్ఠీవిభక్తిలో నున్నది. ద్వితీయా ప్రథమా విభక్తులు కానందున అది కర్మకాదు.

ప్రశ్నలు : 1. కర్త కర్మ క్రియల నెట్లు కను గొందువు?
2. కర్మ ఏ విభక్తులలో నుండును? ఆ విభక్తుల ప్రత్యయము లెవ్వి?
3. నీపాఠమునుండి పదివాక్యముల నెత్తి వ్రాసి అందలి కర్త కర్మ క్రియలను వేర్పరుచుము?

---

# సులభ వ్యాకరణము

## Third Form

## (ఎనిమిదవ తరగతి)

### 1. వర్ణములు—స్థానములు

నీవిదివరలో వర్ణసమామ్నాయమును, వాని సంజ్ఞలను నేర్చియుంటివి. ఇప్పుడవే స్థానములనుండి పలుకఁబడునో తెలిసికొనుము.

వీణ, ఫిడేలు, వగైరా వాయించు నపుడు మన కక్షరములు వినపడును. సన్నాయి, పిల్లనగ్రోవి, ఊదునపుడు నట్లే నక్షరములు వినపడును. మన గొంతుక కూడ అట్లే, సన్నాయి బూర వలెను, పిల్లనగ్రోవి గొట్టము వలెను నిర్మింపబడినది. కంఠము

నుండి విడువబడు గాలి నోటినుండి పోవునపుడు పెదవులు, దంతములు (పల్లు), నాలుక ముక్కు గొనవి కదల్చుటచే పిల్లనగ్రోవి కన్నములు మూసి తెరచినప్పుడు వినబడునట్లు పలురకములుగా వినపడును. అధ్వనులే అక్షరములు. గాలి అంతయు నొకటే యైనను స్థానభేదమును బట్టి అక్షరములు భేదించు చున్నవి. దాన ఆయా అక్షరముల కాయా స్థానముల పేళ్లు వచ్చినవి.

అక్షరములు—స్థానములు—సంజ్ఞలు.

1. అ, కవర్గు, హ, విసర్గలు—కంఠము—కంఠ్యములు(కంఠము నుండి పలుకబడునవి. అనగా నోరు బాగా తెరువ పలుక యుండునని భావము.)
2. ఇ. చవర్గు, య, శ—తాలువులు--(చెంపల లోపలి భాగములు) తాలవ్యములు.
3. ఋ, టవర్గు, ర. ష—మూర్ధ—మూర్ధన్యములు(అంగుడిపై భాగము)
4. ఌ, తవర్గు, ల, స,—దంతములు (పల్లులు)—దంత్యములు
5. ఉ, పవర్గు,—ఓష్ఠములు (పెదవులు)—ఓష్ఠ్యములు
6. ఙ, ఞ, ణ, న, మ—నాసిక (ముక్కుకహాద)—అనునాసిక ములు
7. ఎ, ఏ, ఐ--కంఠతాలువులు--కంఠతాలవ్యములు
8. ఒ, ఓ, ఔ—కంఠ, ఓష్ఠములు--కంఠోష్ఠ్యములు
9. వ,—దంతోష్ఠములు—దంతోష్ఠ్యము
10. ం (సున్న)—నాసిక—నాసిక్యము

ఈ స్థానములను తెల్పు సంస్కృత సూత్రములను, కంఠస్థము చేసికొనుటకై యీ క్రింద పొందుపరచు చున్నాను.

1. అకుహ విసర్జనీయానాం కంఠః. 2. ఇచుయశానాం తాలు. 3. ఋటురషాణాం మూర్ధా. 4. ఌతులసానాం దంతాః. 5. ఉపూపధ్మానీయానామోష్ఠౌ. 6. ఞమఙణనానాం నాసికాచ. 7. ఏదైతోః కంఠతాలు. 8. ఓదౌతోః కంఠోష్ఠం. 9. వకారస్య దంతోష్ఠం. 10. నాసికానుస్వారస్య. ఇతిస్థానాని.

ప్రశ్నలు.

1. అక్షరముల నుచ్చరించుటలో స్థానభేద మున్నదని నిరూపింపుము?

2. పలుకుబడిని బట్టి స్థానీయములను గుర్తించుము?

## 2. తత్సమ-తద్భవ-దేశ్య-గ్రామ్యములు

ఆంధ్ర భాషలోనికి పదములు సంస్కృత ప్రాకృత భాషల నుండి వచ్చినవని చదివితివి. అవచ్చుటలో కొన్ని చివరి యక్షరము మాత్రమే మార్పుతోను, కొన్ని పోలిక కొద్దిగా కన్పడు నట్లును వచ్చినవి. అవిగాక కేవలము మన ఆంధ్రదేశమున వ్యవహారములోనున్న పదములు కొన్ని యున్నవి. ఇతర దేశపు రాజులు పరిపాలించుచున్నందున గాని, సరిహద్దులలో నున్నందున గాని మన భాషలోని కన్యదేశ్య పదములు వచ్చి కొన్ని కలిసినవి. ఆపదములను మనము వాక్కుకలో తలకొక రీతిగా యాసగా పల్కుచున్నాము. ఈ కారణములను బట్టి తెనుగు భాషలోని పదములు నాల్గు రకములుగా విభజింప బడినవి. 1. తత్సమము. 2. తద్భవము. 3. దేశ్యము, 4. గ్రామ్యము.

రత్సమము. సంస్కృత ప్రాకృతములతో సమముంగా నుండునది.

| సంస్కృతము | ప్రాకృతము | తెనుఁగు | సంస్కృతము | తెనుఁగు |
|---|---|---|---|---|
| అగ్నిః | అగ్గి | అగ్గి | హరిః | హరి |
| గౌరవం | గారవం | గారవము | రామః | రాముఁడు |
| జటా | జడా | జడ | విద్యా | విద్య |
| శ్రీః | సిరీ | సిరి | గౌః | గోవు |
| రాజ్ఞీ | రాణీ | రాణి | నౌః | నావ |

తద్భవము. సంస్కృత ప్రాకృతములనుండి పుట్టినది.

| సంస్కృతము | ప్రాకృతము | తెనుఁగు | సంస్కృతము | తెనుఁగు |
|---|---|---|---|---|
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర | ఆకాశః | ఆకాశము |
| ఆశ్చర్యం | అచ్ఛేరం | అచ్చెరువు | కుడ్యం | గోడ |
| యజ్ఞః | జణ్ణో | జన్నము | చంద్రః | చందురుఁడు |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి | తామరసం | తామర |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు | సముద్రః | సంద్రము |

తెనుఁగు చెప్పునపుడు సంస్కృతముతో సమముగా నున్న పదములను ప్రకృతులు గాను, తద్భవ పదములను వికృతులు గాను చెప్పుదురు. కేవల సంస్కృత పదములనే ప్రకృతులుగా చెప్పవలసె యున్నను విద్యార్థులకు సులభముగా తెలియుటకై ఇట్లు చెప్పుచున్నారు.

దేశ్యము: త్రిలింగదేశమున వ్యవహరింపబడు భాషను దేశ్యమందురు. త్రిలింగదేశ మనగా తెలుఁగు దేశము. త్రిలింగము

లనగా-శ్రీకాళహస్తి, ద్రాక్షారామము, శ్రీశైలములు. ఈ భాషను 'అచ్చతెలుగు' అందురు.

ఉదా: ఊరు, పేరు, అత్త, అల్లుడు, వాడు, ఏరు, తల్లి, తండ్రి, ఇల్లు, కోట, పేట, దూడ, మేడ, కోత, లేత, బల్లి, కల్లు, ఇత్యాది.

దేశములో మనము మాటలాడునపు డొక్కొక్క ప్రాంతము వార మొక్కొక్క రీతిగా మాటలాడు చుందుము. ఒక మండలభాష మరొక మండలమునకు యాసగా కన్పడును. ఒక రిది మరొకరికి, వారి దింకొకరికిగా అందరు మాట్లాడునదియు యాసగా నుండునదే. దానినే 'వ్యావహారికభాష' అందురు. ఆభాషలో గ్రంథములు వ్రాసినచో నందరికి సమముగా తెలియుట సంభవింపనందున పుస్తకములు వ్రాయుటకై యొక భాషను వాడు దురు. అదే గ్రాంథికభాష! దానికి వ్యాకరణ నియమము లుండును.

గ్రామ్యము: వ్యాకరణ నియమములు లేక విచ్చలవిడిగా వాడబడునది.

ఉదా: వస్తున్నాడు, ఒత్తున్నాడు, ఒత్తన్నడు, ఒత్తడు మొ॥

సూచన:-గ్రంథములందు ఆయా ప్రాంతీయుల పాత్రలను వ్రాయునపుడు వారి ప్రత్యక్ష సంభాషణ (Direct Speech) లో మాత్రము గ్రామ్యభాష వాడవచ్చును.

అన్యదేశ్యము.

మన దేశమునకు పరిసరములలో అరవము, హిందీ, మరాటీ, ఒరియా భాషలున్నవి. వాటి సంపర్కముచే మన భాష

లోనికి సైతము మాభాషాపదములు వచ్చినవి. అట్లే ఆంగ్లేయులు, తురుష్కులు పరిపాలించు నపుడా భాషల పదములు వచ్చిపడినవి. ఆపదముల నన్నింటిని మన వ్యాకరణము ప్రకారము-అనగా మన పలుకుబడి ప్రకారము రయారుచేసి వాడుకొను చున్నాము.

ఉదా: లాంతరు, లేవ, తహశ్శీలుదారు, కలెక్టరు, రోడ్డు, తయారు, రోజు, ఎకాయకీ,వాయి, మున్నగునవి.

ప్రశ్నలు:

1. భాషయెన్ని రకములు?
2. తత్సమ మనగా నేమి? ఉదాహరింపుము?
3. తద్భవ మనగా నేమి? ఉదాహరింపుము?
4. దేశ్యమనగా నేమి? ఉదాహరింపుము?
5. అన్యదేశ్యము లెవ్వి? మరి కొన్నిటిని వ్రాయుము?

సూచన:-ఉదాహరించునపుడు వీలైనంతలో నీకు వచ్చిన పాఠములలోని పదముల నేరి చూపవలెను. కాని పుస్తకములో వ్రాసిన వాటినే చూపరాదు.

## 3. కళాద్రుత ప్రకృతికములు

'న' కారమునకు ద్రుత మని పేరున్నది కదా.అది ఎల్లప్పుడును (ప్రకృతి సిద్ధముగా) చివర కల్గిన పదము ద్రుత ప్రకృతికము. 'నిన్, నున్, వచ్చెన్, అయ్యెడున్' ఇత్యాది.

ద్రుతమనగా 'అవసరము లేనిచో మరగి పోవునది' అనగా 'ఏయే పదములలోని నకారమును తీసివేసినను అర్థము మారదో ఆపదములలోని నకారము మాత్రమే ద్రుతము' అని సంజ్ఞ.

ఉ: 1. నేను-నేన్-నేఁజదివితిని.

2. చేను-చేన్-చేఁబండినది.

వీటిలో భేదమును గమనింపుము. మొదటి దానిలో 'నేను, నేన్, నే' లకు అర్థము మాఱలేదు. రెండవదానిలో 'చేను' అన్నినప్పుడే 'పంటపొలము' అని అర్థము వచ్చునుగాని 'చేన్, చే' అన్నచో ఆ యర్థమురాదు.

మఱికొన్ని ఉదాహరణములు.

| కళలు | ద్రుతప్రకృతికములు |
|---|---|
| నాను | వెళ్లెను |
| చేను | వెళ్లెను |
| పేను | ఎల్లన్ |
| కోను | కావుతన్ |
| రాను | నేను |
| పోను | తాను |

'ప్రథమా, కై, షష్టి, యొక్క, తప్ప తక్కిన విభక్తి ప్రత్యయములును, వత్తున్, వచ్చెదన్, వచ్చెన్, కొట్టుచున్, కొట్టన్, కొట్టఁగన్, కొట్టుడున్, కొట్టినన్, వలెను, పోలెన్ మొదలైనవి ద్రుతప్రకృతికములు.

చివర 'న' కారములేనివి 'కళలు'

విభక్తి ప్రత్యయములలో 'డుమువులు, కూర్చి (గురించి) కై (కయి) షష్టి యొక్క' లు కళలు. లేక, ఏల మొదలైన అవ్య

యములు. వచ్చితివి, వచ్చితిరి, వచ్చితిమి, రాడు, రాదు, రాము, రావు, రాము, కొట్టక, ఊరక, ఒరే, అక్కట, ఆహా మొదలైనవి.

ప్రశ్నలు: 1. కళలననేవి? 2. ద్రుతమననేది?
3. ద్రుతప్రకృతిక మననేది?
4. పాఠమునుండి రెంటికి కొన్ని యుదాహరణలిమ్ము?



# 4. వాక్యములు-భేదములు

మనము మాట్లాడు నపుడు భావానుసారముగా వాక్యములను వాడుదుము. ఆ భావములను బట్టి ఆ వాక్యములు కూడ పలు రకములుగా నుండును.

ఉదా: 1. నేను పాఠమును చదివితిని.
2. నేను పాఠమును చదవలేదు.
3. నీవు పాఠమును చదివితివా?
4. నీకు పాఠము వచ్చివేసినదే!
5. నీవు పాఠమును చదువుము.

పై వాక్యములను చదువుము. భేదమును గమనించుము. ఒక దానిపోలి మరొకటిలేదు. 1. నిశ్చయార్థకము. 2. వ్యతిరేకార్థకము. 3. ప్రశ్నార్థకము. 4. ఆశ్చర్యార్థకము. 5. విధ్యర్థకము.

ఇందలి భావమును బట్టియే వీనికి పేర్లు పెట్టబడినవి. ప్రశ్నకుపయోగించునది ప్రశ్నార్థకము, విధికుపయోగించునది విధ్యర్థకము, ఆశ్చర్యమును తెల్పుట కుపయోగించునది ఆశ్చర్యార్థకము. పై చెప్పిన విశేషార్థము లేమియు రాకుండ వాడబడిన

వాక్యమును నిశ్చయార్థక మందురు. కాని వ్యతిరేకార్థక వాక్యము కూడ నిశ్చయమునే చెప్పునదగుటచే ఆ విభాగము తప్పు. నిశ్చయమునకు వ్యతిరేకము సంశయము. సంశయార్థక వాక్యము ప్రశ్నార్థక వాక్యమువలెనే యుండును. నీవు వెళ్ళితివో ? లేదో ? ఇది ప్రశ్నార్థకముకాదు. సంశయార్థకము.

వాక్యములలో మరికొన్ని భేదము లున్నవి.

1. నేను పాఠమును చదువుచున్నాను.

2. నేను బడికి వెళ్ళి, పాఠము చదివితిని.

3. నేను బడికి వెళ్ళి, పాఠములు చదువుచు, నా విధులను నెరవేర్చుకొంటిని.

4. నీవు బడికి రమ్ము లేదా పనిచేసికొనుము.

వీనిలోని భేదములను గమనింపుము. 1. సామాన్యవాక్యము (Simple Sentence) దీనిలో విభాగములులేవు. 2. సంశ్లిష్ట వాక్యము (Complex Sentence) ఇందొక అసమాపక క్రియ యున్నది. ఒక సమాపకక్రియ యున్నది. 3. ఇదియును సంశ్లిష్ట వాక్యమే. 4. మహా వాక్యము. (Compound Sentence) ఇందు రెండు సమాపకక్రియ లున్నవి. రెండు సామాన్యవాక్యములు కలిసి యొకే వాక్యముగా వాడబడినచో, దానిని మహావాక్య మందురు.

ఈ వాక్య విభాగమంతయు నాంగ్ల పద్ధతిని బట్టియే చేయ బడినది. సంస్కృతమున సామాన్య. మహావాక్యములని రెండే భేదములు. ఒక వాక్యములో భాగములు, వాక్యములుగా నున్నచో

వాటిని 'అవాంతరవాక్యము' లందురు. విరామ చిహ్నములు కూడ ఆంగ్ల పద్ధతి ననుసరించియే వచ్చినవి.

ప్రశ్నలు : 1. వాక్యములెన్ని రకములు ?
2. వాటి కా పేర్లు తగియున్నవని నిరూపింపుము ?
3. వాక్యములను మార్చి చూపుము ?
4. ఆంధ్ర వ్యాకరణరీతిగా వాక్యభేదమును వ్రాయుము?

---

## 5. కర్తరి-కర్మణి ప్రయోగములు
(Active-Passive Voices)

(a) 1. రాముడు భక్తుని రక్షించెను.
2. బాలుడు పాఠమును చదివెను.

(b) 1. రామునిచే భక్తుడు రక్షింపబడెను.
2. బాలునిచే పాఠము చదువబడెను.

ఈ వాక్యములను గమనింపుము. మొదటివానిలో కర్త ప్రథమా విభక్తిలోను, కర్మ ద్వితీయావిభక్తిలోను ఉన్నది. రెండవవాటిలో కర్త తృతీయావిభక్తిలోను, కర్మ ద్వితీయా విభక్తిలోను ఉన్నది. కర్త కర్మల కా మార్పు గమనింపవలెను. ఇక క్రియకు-రక్షించెను-రక్షింపబడెను 'రక్షించు+ఎను' అన్న దానికి-రక్షించు+పడు+ఎను' అని 'పడు' ప్రత్యయము కలుప బడినది. ఇదే భేదము. మొదటిదానిలో కర్తను బట్టి క్రియ యొక్క వచనము మారును. 'రాముడు భక్తుని రక్షించెను; దేవ తలు భక్తుని రక్షింతురు.' అట్లు మారుటచే దీనిని 'కర్తరిప్రయోగ' మందురు. దేవతలచే భక్తుడు రక్షింపబడెను. రామునిచే భక్తులు

రక్షింపబడిరి.' వీటిలో కర్మనుబట్టి క్రియయొక్క వచనము మారినది. అందుచే దీనిని 'కర్మణి ప్రయోగ' మందురు.

ప్రశ్నలు: 1. కర్తరి, కర్మణి ప్రయోగముల కా పేర్లెట్లు వచ్చినవి ? 2. ప్రయోగమును మార్చినపుడు కల్గు మార్పులేవి ? 3. పాఠమునుండి కొన్ని యుదాహరణలిమ్ము ?

సకర్మక-అకర్మక వాక్యములు

రాముడు విభీషణుని రక్షించెను. రాముడు అయోధ్యకు వెళ్లెను. ఈ వాక్యములను చూడుము. మొదటిదానిలో కర్మ ఉన్నది. రెండవదానిలో లేదు. కర్మ ఉన్నది సకర్మకము: కర్మ లేనిది అకర్మకము. కొన్నిటిలో రెండు కర్మ లుండును.

1. కృష్ణుడు ఆవులను పాలను పితికెను.

2. వామనమూర్తి బలిచక్రవర్తిని భూమిని అడిగెను.

3 గురువు, శిష్యులనుగూర్చి పాఠములను బోధించెను.

వీటిలో రెండేసి కర్మలున్నవి. వీటిని 'ద్వికర్మకము' లందురు.

కొన్ని సకర్మకములను అకర్మకములుగా వాడబడినను కర్మ ఉన్నట్లే చూచుకొనవలెను. ఉదా:-- రాముడు తినెను. అనుటతో ఆ వాక్యము పూర్తి అర్థము నియ్యదు. దేనిని ? అన్న ప్రశ్న పుట్టక మానదు. ఆ ప్రశ్నను తీర్చుటకై 'అన్నమును' అని చెప్పక తప్పదు. అందుచే అది సకర్మకమే. 'రాముడు వెళ్లెను' ఈ మాటలో, దేనిని ? అన్న ప్రశ్నయే లేదు. కావున ఇది అకర్మకమే. ఈ రీతిగా సకర్మకము, అకర్మకము అను విభాగము లా క్రియను బట్టియే యుండునుగాని ప్రయోగమును బట్టికాదు.

ప్రశ్నలు : 1. సకర్మకమననేమి ? అకర్మకమన నేమి ? 2. కర్మలేకుండ ప్రయోగించిన వాక్యమును, కర్మయున్నదో లేదో యెట్లు గుర్తింతువు ? 3. నీ పాఠమునుండి కొన్ని యుదాహరణ లిమ్ము ?

# 6. సంధులు

తెలుఁగు భాషలోనికి సంస్కృతమునుండి పదములు వచ్చిన వని చదివితివికదా ! అందుచే ఇప్పుడు తెలుగు సంస్కృత సంధులను నేర్వవలెను! రెండుపదములను కలుపుటయే సంధి.

సంస్కృత సంధులు

దేవాలయము = దేవ + ఆలయము, దివ్యౌషధము = దివ్య + ఔషధము.
దేవేంద్రుడు = దేవ + ఇంద్రుడు మునీశ్వరుడు = ముని + ఈశ్వరుడు

ఈ పదములను, విడదీసిన రూపములను పరిశీలింపుము. రెండు పదములను కలిపి తేలికగా ఉచ్చరించుటకై అట్లు కలుపుదుము. ఆ కలుపుటలో కొన్ని మార్పులు వచ్చుచుండును. ఆ మార్పులను గుర్తించుకొనవలెను. ఏ యే పదములు కలిసియున్నవో విడదీయుట తెలిసికొనినగాని వాక్యమర్థముకాదు. అందుచే విడదీసికొనుట ముఖ్యము.

తెలుఁగు సంధులు

1. నేను + ఆటలు + ఆడితిని = నేనాటలాడితిని (ఉకారసంధి)
2. అతఁడు + ఏ, నా + అన్న = అతఁడే నాయన్న (యడాగమ సంధి)

3. నేన్+చదివితిని=నేఁజదివితిని (ద్రుతసంధి)
4. దాసోహం+అనేన్+కదా=దాసోహమ్మనేఁగదా (ద్విత్వసంధి)
5. వాడు+చెప్పెను=వాడుసెప్పెను. (గసడదవాదేశసంధి)
6. మదము+ఏనుగు=మదపుటేనుగు (పుంప్వాదేశసంధి)
7. చిగురు+ఆకు=చిగురుటాకు (టుగాగమ సంధి)
8. పేద+ఆలు=పేదరాలు (రుగాగమసంధి)
9. కడ+కడ=కట్టకడ (ఆమ్రేడితసంధి)
10. నడు+ఇల్లు=నట్టిల్లు (ద్విరుక్తటకారసంధి)
11. ఆహా+ఆహా=ఆహాహా (ఆమ్రేడితసంధి)
12. ప్రాత+తోఁట=ప్రాఁదోట (ప్రాతాదిసంధి)
13. క్రొత్త+నన=క్రొన్నన (క్రొత్తాదిసంధి)
14. వచ్చు+అతఁడు=వచ్చునతఁడు (నుగాగమసంధి) ఇత్యాది.

ఈ సంధుల పేర్లు విడదీయవలెనో ఉపాధ్యాయుడు చెప్పునప్పుడు జాగ్రత్తగా గుర్తించవలెను. ఎన్ని చదివినను క్రొత్తగానే కన్పడును. ఈ సంధుల పేర్లు తెలిసికొనుట అంతగా ముఖ్యమైనది కాదు. అవి గుర్తుంచుకొనుటకు చెప్పునవిమాత్రమే.

ఇంకను వీటిలోని విశేషములను మా 'సులభవ్యాకరణము' ద్వితీయభాగమునఁ జూడుడు.

